శ్రీరస్తు.

# జనార్దన శతకము.



ఇది

భగవద్భక్తుల కత్యంతోపయుక్తము.

వల్లభరాజు సుబ్రహ్మణ్యకవిపుత్రులును

చేబ్రోలుపుర వాస్తవ్యులు నగు

## సోమకవిగారిచే

రచియింపబడి



విశాఖపట్టణమున

శ్రీ శారదామకుట ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి

ప్రకటింపబడియె.

వెల 2 అణాలు.

1914.

శ్రీరస్తు.

# జనార్దన శతకము.

ఉ. శ్రీ రమణీయమౌ కనకచేలము దాల్చి యురమ్మునందు ల
క్ష్మీ రమణీమణిన్ నిలిపి సేవకవర్గశుభప్రదాతవై
కారుణికత్వ మేర్పడ జగంబుల నేలెదు నిన్ భజింతు వి
స్తారపుభక్తితోడుత రజాలపురీనిలయా జనార్దనా. 1

చ॥ రసనపవిత్రతం దనరు రాజితకీర్తి ఘటిల్లు నెన్నియో
దొసగు లణంగు దుర్వ్యసనదూరు డుదారుడునై యెవండు నిన్
వినువక సంస్మరించు పృథివీస్థలి నాతని కట్లు గాన రా
జసమును వీడి కొల్చెద రజాలపురీనిలయా జనార్దనా. 2

ఉ. జాములు నాల్గుజెల్లు దివసమ్మున కందొకజామునైన నీ
నామము నాత్మలో నిలిపినన్ సుకృతాత్మకుడౌ జగంబునం
దామనుజుండె తావకదయారసదృష్టికి పాత్రమై తగున్
సామజరాజరక్షక రజాలపురీనిలయా జనార్దనా. 3

చ. కొలిచితి పెక్కుదేవతల గోరికలన్ నెరవేర్తురంచు నిన్
దెలియనివాడనై యిపుడు దీటుకొనెన్ భవదీయభక్తి ని
శ్చలమిది మేన ప్రాణములు చక్కగ నుండినయంతనట్టు వి
చ్చలవిడి సన్నుతించెద రజాలపురీనిలయా జనార్దనా. 4

ఉ. వేలుపు లస్రిపోత్కరము బెట్టు వెతల్ బడలేక భారతీ
లోలు పురస్కరించుకొని లోగలభీతి దొలంగజేయు ధీ
శాలిని నిన్ను జేర విలసత్కృప గాచితి వీవె తద్ద్విష
జ్జాలము బిల్కుమారిచి రజాలపురీనిలయా జనార్దనా. 5

ఉ. పాతకపుంజభంజనము పండితపుంగవపూజితంబు సం
భూతసురాపగాఝరము పుణ్యమునీంద్రమనోమధువ్రతో
ద్గీతము బాలపల్లవసఖత్వమృదుత్వము నీదు పాదకం
జాతము నాశ్రయించెద రజాలపురీనిలయా జనార్దనా. 6

చ. పురములు గ్రామముల్ విపినముల్ హిమవన్నగముఖ్యమేదినీ
ధరములు పంచభూతములు తారక లర్కముఖగ్రహంబులున్
శరధులు నీవిలాసమునె చాటుచునున్నవి నీవె యీచరా
చరము భరించువాడవు రజాలపురీనిలయా జనార్దనా. 7

చ. జలనిధిలోన వీచికలచందమునన్ మదిలో జనించు నూ
హలు బహుళంబులై యవి బయల్పడజాల వి కేమి సేతు నా
తలపున నిల్వుమయ్య పరితాప మడంగ దయామృతంబు ని
చ్చలు గురియంగ జేయుచు రజాలపురీనిలయా జనార్దనా. 8

చ. నిను గొనియాడ నీదు పదనీరజసేవ నొనర్ప నీకథల్
విన నిను మోక్షదాయకుని వేడ్క గనుంగొన బుణ్యమంచు నా
మనమున కింత దెల్పి మఱి మద్రసనాకరకర్ణయుగ్మలో
చనముల కానవెట్టెద రజాలపురీనిలయా జనార్దనా. 9

ఉ. నీవు బరుండుశయ్యకును నీవు యథేచ్ఛగ నెక్కు జక్కికిన్
నీవు ధరించు భూషలకు నీప్రియురాలికి నీభటాళికిన్
నీవు వసించుకోవెలకు నీకు ననేకనతుల్ ఘటింతు పూ
జావిధ మిట్టిదే కద రజాలపురీనిలయా జనార్దనా. 10

చ. పనివడి పాండుపుత్రునకు బ్రహ్మరహస్య మెఱుంగ జేసి నీ
పని నెరవేర్చుకొంటి కొదువంబడనీయక దేవ నీదు మా
య నెవ డెఱుంగజాలు ప్రమథాధిపుడంతటివా డొకప్డు ద
ర్శన మొనరించి జోగడె రజాలపురీనిలయా జనార్దనా. 11

చ. పలుకులు వేయునేల తొలుబల్కులు నీమహిమన్ నితాంతమున్
దెలుపుచునుండ దెల్లమగుతీరున దాము గ్రహించి లబ్ధవ
ర్ణులు మదిలోన బాయక నినుం గలకాలము సంస్మరింతు రా
సలుడిగి మోక్షలబ్ధికి రజాలపురీనిలయా జనార్దనా. 12

చ. ఎరగలి కాన నేర్చుగతి హేళి తమంబు హరించుపద్ధతిన్
గరువలి మబ్బులం గలచుకై వడి మంచు బిసప్రసూనమున్
జెరిపినరీతి పాపముల జిందరవందర జేసి త్రోయు గ్రి
చ్చర భవదీయమానుతి రజాలపురీనిలయా జనార్దనా. 13

చ. కలుము లొసంగి ప్రోచితివి కల్మషదూరు గుచేలు నప్పుడ
వ్విలసితమూర్తికిం గలుగు ప్రీతి వచింపగ నెట్టిదో దయా
కలితుడ వీవు భక్తులకు గల్పకుజంబవుకావె తండ్రి యుం
జలులు ఘటింతు నీ కొగి రజాలపురీనిలయా జనార్దనా. 14

ఉ. తీరని వాంఛతో దిరిగితిన్ బహుదేశము లంతలో నవ
ద్వారపురంబులో మెలగు తత్త్వము బైటికి దోచె గొంత నా
తీరని వాంఛలన్నియును దీరి తటాలున మోక్షకాంక్షినై
శౌరి నినుం గణించితి రజాలపురీనిలయా జనార్దనా. 15

చ. తృణమును మేసి దోగ్ధలకు తియ్యనిపాల నొసంగునై చికీ
గణ మహహా పరోపకృతికై నెనరొప్ప సృజించితోయి నీ
ఋణ మిసుమంత దీర్పగల రే జను లెంతటివారలున్ బ్రతి
క్షణము నినుం దలంతురు రజాలపురీనిలయా జనార్దనా. 16

ఉ. కాయములన్న బుద్బుదనికాయము లంబుజసీదళోదక
ప్రాయము జీవితం బరయ భాసురసంపదలౌనిరమ్మదో
న్నేయము లస్థిరంబులు గణింపగ నన్నియు నుర్వి శాశ్వత
స్థాయి సుకీర్తి యొక్కటె రజాలపురీనిలయా జనార్దనా. 17

ఉ. నీదగుబొడ్డుదమ్మిని జనించి ప్రపంచకమున్ సృజింప నా
ళీకయితుండు దక్షత గనెన్ భవదంఘ్రిసముద్భవంబు గం
గోదక మంబరాంబరమహోన్నతమస్తకసీమ జేరె నీ
సాధుత వర్ణనీయము రజాలపురీనిలయా జనార్దనా. 18

ఉ. వ్యాసమహర్షి నీదుపదభక్తశిరోమణి బ్రహ్మసూత్రముల్
వ్రాసి రహస్యముం దెలిపె పండితకోటి పఠించిమెచ్చ నీ
దాసులు సేయు బోధ లవి ధర్మవిశిష్టముతోట మేటి వి
శ్వాసముగూర్తు నీదెస రజాలపురీనిలయా జనార్దనా. 19

చ. జగము చరాచరాత్మకము జంతుమయం బిది స్వప్నతుల్యమై
నెగడు ప్రబోధముం గనిన నిశ్చలచిత్తున కజ్ఞుఁడక్కటా
తగ నిదె శాశ్వతంబని వృథా జడతావిపరీతవాదియై
జగడము లాడబోవును రజాలపురీనిలయా జనార్దనా. 20

ఉ. క్రొత్తడిబోలు భర్త కనుకూలత గాంచి మనంగజాలుటన్
బుత్త్రడిబోలు తాపమును బొందినవేళఁ నన్నెకొల్చుటన్
జిత్తడిబోలు తావకవిశేషకృపారసధార లొప్పుటన్
సత్త్వమభక్తి పేర్కొన రజాలపురీనిలయా జనార్దనా. 21

చ. కడుకొని చిమ్మచీకటులు గ్రమ్మినవేళ వనాంతరంబునం
దడలుచు నొంటిగా నఱుగునట్టి మనుష్యుడు దారిగాన కం
దిడుమల బడ్డ నేమియగు నెవ్వరు కాచెడివారు నీవె యా
సడి గని పెట్టువాడవు రజాలపురీనిలయా జనార్దనా. 22

చ. గణగణగంటమ్రోగుగతి కంఠనినాదము నివ్వటిల్ల నీ
గుణగణకీర్తనం బెవఁడకుంఠితలీల నొనర్చు వాని కా
క్షణములె మేలుగూర్చునవి సత్యము సత్యము సర్వలోకర
క్షణచణ బాహువిక్రమ రజాలపురీనిలయా జనార్దనా. 23

చ. పగతురపట్ల మిత్రములపట్ల సమత్వముగల్గి యన్యమం
దగమనలన్ స్వమాతలవిధంబున జూచెడివారలున్ ద్వగా
తిగులును సంగవర్జితులు దీనదయాపరులున్ భవత్ప్రియుల్
పగటున వీరలెల్లరు రజాలపురీనిలయా జనార్దనా. 24

చ. అడవుల జొచ్చినన్ గిరిగుహాంతరసీమల డాగియున్న న
ల్లడలకు బారసే నకట కష్టసుఖంబులు రాకమాన వీ
పుడమిని దేహధారులకు బుద్ధి నినుం గొనియాడరాదె యీ
జడుపులు వొందనేటికి రజాలపురీనిలయా జనార్దనా. 25

ఉ. వ్యాళములట్లు రోషవశులై వనహస్తులపోల్కి మత్తతం
గ్రాలు నృపాలురం గొలిచి కష్టఫలంబుల కాసజెందకే
వేలకువేలు పద్యములు వేడుకనై రచియించి నీకిడం
జాలినవాడె సత్కవి రజాలపురీనిలయా జనారనా. 26

చ. అరయ శరీరమందు గల గార్వురుదొంగలు లేనిపోని యు
ల్లరులకు ముఖ్యకారకులు లావరులై తఱి వేచి జ్ఞానమన్
సురుచిరరత్నముం గొనగ సూరివరేణ్యు లెఱింగి వీరలన్
సరగున గాచికోదగు రజాలపురీనిలయా జనార్దనా. 27

చ. ఇరువదినాల్గుతత్త్వముల కెంచగ నావలితత్త్వ మీవయై
పరగుదువోయిసామి నిను బ్రార్థన జేసెద సంతతంబు నా
మొర వినవయ్య నీకు దగ మ్రొక్కెదనయ్య నిజంబుగాగ నీ
చరణయుగంబె నమ్మితి రజాలపురీనిలయా జనార్దనా. 28

చ. అనఘములో తపస్సులడుగంటె నధర్మత బ్రాహ్మణాదివ
ర్ణనియతి బీరువోయె సుగుణంబులు మృగ్యములాయె దుష్ప్రవ
ర్తనములు హెచ్చె సూనృతము దప్పె నహా కలికాలమందు స
జ్జనులు మెలంగు టెట్లొకొ రజాలపురీనిలయా జనార్దనా. 29

ఉ. వ్యాధులు చుట్టుముట్టి తను బట్ట భయంపడు లేశిపోలికన్
వ్యాధులు నెమ్మియుం జెనకి ధూర్తి ఘటింపగ నంతరాత్మ త
ద్వ్యాధ సహింపలేక కలతంబడు గావున నిప్పుడే వపు
స్స్వస్థత జేసి కొల్చెద రజాలపురీనిలయా జనార్దనా. 30

చ. ఘనపాకరైలువంటిది సమస్తదిశావిదిశానుగామియై
యొనరుట వైశ్రమముం గొనుట నెక్కడ నించుక సేపు తాళియుం
టను బహులోహమై ప్రబలుటన్ మనుజావళి కోయి దైవమా
చనునె వినిశ్చలత్వము రజాలపురీనిలయా జనార్దనా. 31

చ. తనువిది ధర్మసాధనము ధార్మికు లిమ్మహనీయమైన సా
ధనమె సుబుద్ధి నూతగొని తత్వకళాపరిపూర్ణులై సుధా
శననివహార్చనాదివిలసచ్చరణాంబురుహద్వయున్ నిరం
జను నిను నాశ్రయింతురు రజాలపురీనిలయా జనార్దనా. 32

చ. సుకవి కవిత్వవైభవము సూరిజనస్తవనీయమైన చో
ప్రకటము నొందు లోకమున పామరు లేమనుకొన్న నేమి యా
సుకృతము జారిపోవునె యశోనిచయంబు దొరంగిపోవునే
సకలజగన్నియామక రజాలపురీనిలయా జనార్దనా. 33

ఉ. ఆసల జిక్కి వేసటల నందరు నిందలొనర్చువారిపై
రోస మొకింతయుం గన రొరుల్ తమ సన్నిధి జేరి సన్నుతుల్,
సేసిన మెచ్చి పొంగరు వసిష్ఠసమానులుగారె బ్రహ్మజి
జ్ఞాసువులౌ మహాత్ములు రజాలపురీనిలయా జనార్దనా. 34

ఉ. బాలుడవై మహీధరము పాణియుగంబున బూని తంబుభృ
న్నీలుడవై తమంబణగ నిస్తులకాంతియుతప్రదీపముం
బోలి వెలుంగుచుంటివి నమో భగవన్ భవతే యటంచు నే
జాల నినున్ స్మరించెద రజాలపురీనిలయా జనార్దనా. 35

ఉ. మానుగదృష్టి కన్బొమలమధ్యమునందు నిగుడ్చి నిశ్చలం
బైన మనంబుతోడుత నుపాసన జేసి పరాత్పరున్ నినున్
గాన సమర్థులౌదురు సుఖంబులనంగను షూరిపేకదా
జ్ఞానులచర్య లట్టివి రజాలపురీనిలయా జనార్దనా. 36

ఉ. తీవ్రపరాక్రముండు నతిధీరుడు భారతయోధమౌళి దే
వవ్రతుడైన భీష్ముడు ప్రభావము నీయది తా గ్రహించి ధ
ర్మవ్రజదాత్మశక్తిని విరాజిలె నిన్గొనియాడనేని దో
షవ్రజమెల్ల బాయును రజాలపురీనిలయా జనార్దనా. 37

ఉ. ఎన్ని భవంబులొందితిని యెప్పటికప్పుడె విస్మృతంబులై
యన్నియు గ్రొత్తవానివలె నక్షులకుం గనుపట్ట నబ్బురం
బెన్నకొనంగ శాంబరి యిదేయని తోచదు దీనిచేత బ్ర
చ్ఛన్నుడుగాడె జీవుడు రజాలపురీనిలయా జనార్దనా. 38

ఉ. కన్నులు మూసి నోర్మదుప గానగవచ్చునె బ్రహ్మమయ్యె వి
ద్యున్నతు డాత్మదర్శన విభాసియునౌ గురు నాశ్రయించినన్
దిన్ననిమార్గమెయ్యదియొ తెల్పి కనంబడ జేయునప్పు డీ
సన్నలు సన్నగిల్లును రజాలపురీనిలయా జనార్దనా. 39

చ. తనమహితప్రభం జొనిపి తామరసంబుల నేలుచున్ బవ
ళ్లినుడు ఘటించు చంద్రు డుదయించినవాడయి వెన్నెలన్ జగం
బును వెలయించి రేలుజనుపున్ మఱి కాల మిదే క్రమంబుగా
జనుల వయస్సు దొంగిలు రజాలపురీనిలయా జనార్దనా. 40

చ. ప్రితిదహరంబునన్ బెడనివస్తు వొకం డలరారు సూనృత
వ్రతులు గురుప్రసాదమున బంధపరిచ్యుతులై విరాగులై
క్రతువొనరించి లోపలనె శాంతులు వారలెపో గరిష్ఠులున్
సతతము నీకు భృత్యులు రజాలపురీనిలయా జనార్దనా. 41

చ. ధనమునకై ప్రియత్నములు తద్దయు వేలకొలంది పన్ని యా
ర్జన మొనరించినంతనె యశం బొనగూడునె దాతయై పరం
బును దలపోసి పాత్రమున భూరివిసర్జన మాచరింపగా
జను నతడే ప్రసిద్ధుడు రజాలపురీనిలయా జనార్దనా. 54

ఉ. ఈహలు దక్కి యెప్పటికి నింద్రియలోలుడుగాక యోగి యీ
దేహము పాంచభౌతికము దీనిని యోగబలంబుమై చిరా
నేహము భూతలంబునను నిల్పి నిజాత్మపరంబు జేర్చి యు
త్సాహమునం జరించును రజాలపురీనిలయా జనార్దనా. 55

ఉ. జీవుడు నైజకర్మగతి జిక్కి శరీరమునందు దొల్లి తా
నేవిధినుండెనో యెచట నేమియొనర్చెనొ యెవ్వరాప్తులై
రో వెరవొప్ప గాంచెము నెఱుంగ సమర్థుడుగాక మాయచే
జావులు పుట్టువుల్ గను రజాలపురీనిలయా జనార్దనా. 56

చ. నరుడయి కర్మభూమి జననంబును బొందినవానికిన్ ఫలం
బరయగ సర్వకాలములయందు ముకుంద మురారి మాధవా
పరమదయాకరా గరుడవాహన యచ్యుత యంచు భక్తితో
స్మరణము సేయుటే యగు రజాలపురీనిలయా జనార్దనా. 57

ఉ. జ్ఞానమొకండె కారణము సర్వమతంబుల నెంచిచూడ ని
ర్వాణపదాప్తి కయ్యది విరాజిలు జన్మము లెన్నియో చనం
గా నటుమీదటన్ భవము గాంచక జీవుడు నిర్వృతిప్రియుం
డానుడగున్ భవత్కృప రజాలపురీనిలయా జనార్దనా. 78

ఉ. ఆలని ముద్దుబిడ్డడని యన్నలు దమ్ములటంచు సౌహృదం
బోలి ఘటించి త్రిప్పెద వహో నరులన్ వృథగా సముద్రముం
బోలిన ఘోరసంసృతిని మూఢత వీడి నినున్ భజింప నీ
జాలుదు ముక్తి వీరికి రజాలపురీనిలయా జనార్దనా. 59

ఉ. ఈవయినుండనైదెసల నెంతయు గార్కొనినట్టి చీకటుల్
వోవ సహస్రభానువుల బూని వెలుంగుచు గాలయాపనం
బావహిలంగ జేసెడ వహర్గణముల్ గణుతింతు నిన్ను కృ
ష్ణా వనజాతలోచన రజాలపురీనిలయా జనార్దనా. 60

ఉ. కర్మఫలప్రలుబ్ధులకు గా జెరసాలలబోని దేహముల్
నిర్మితముల్ ప్రపంచమున నిష్ఠమెయిన్ నిరపేక్ష నొందిస
త్కర్మము లెప్పుడుం జరుపగా దగు పండితు లట్టివారికే
స్వర్మణిసాధసౌఖ్యము రజాలపురీనిలయా జనార్దనా. 61

ఉ. ఒక్కెడ మూర్తిమంతముగ నుండియు బిల్చిన మాటలాడకే
చక్కగ భుక్తిముక్తు లిడి సాకెద వెవ్వరు సాటి నీకు నీ
విక్కరణిం బ్రకాశత వహించుట నద్భుతమాయె సామి నీ
చక్కి వసింపగోరెద రజాలపురీనిలయా జనార్దనా 62

ఉ. కాళియనామధేయభుజగస్ఫటలన్ మును దాండవక్రియా
లోలుడ వౌట నిప్పటికి లోకమువారికి దత్కులోద్భవ
వ్యాళఫణాగ్రభాగములయందు భవత్పదచిహ్నముల్ గనం
జాలినవాయె వింతగ రజాలపురీనిలయా జనార్దనా. 63

ఉ. ఆకలిగొన్నమానవున కన్నము వెట్టి పిపాస నార్తుడై
వాకిట కాగతుండయినవానికి దియ్యని నీరొసంగి దై
న్యాకలితాంతరంగుని ధనాధికతృప్తుని జేసి కీర్తి చే
సాకరిగాంచు ధన్యుడు రజాలపురీనిలయా జనార్దనా. 64

ఉ. కాలమునందె భూతములు గల్గుట మానుగ వృద్ధిబొందుటల్
కాలము సేయుటల్ మరల గర్మవశమ్మున బుట్టుచుండు టీ
కాలము నీస్వరూపమగు గావున దీనిని మీర నెవ్వరుం
జాలరు నిశ్చయం బిది రజాలపురీనిలయా జనార్దనా. 65

ఉ. పేదరికంబునన్ మునుపు పెద్దయు డస్సినవాఁ డొకింత సం
పాదకుఁడైన గర్వమున బంధుల నాప్తుల దూఱి వారిచే
నాదట నిందితుండగు నహంయుత కొంతయుణంగు నప్పుడా
పాదితలజ్జ గ్రుమ్మరు రజాలపురీనిలయా జనార్దనా. 66

ఉ. ఉత్తముఁడైనవాఁడు విభవోన్నతి నెంత దనర్చినన్ మదో
న్మత్తుఁడుగాక నాయమగు మార్గముపై మనసుంచి కౌతుకా
యత్తమతిం జరించు బరమార్థము వాని ధనమ్ముగాదె భా
స్వత్తులసీదళాంచిత రజాలపురీనిలయా జనార్దనా. 67

చ. నరునిశరీరమం దలరు నాడులు డెబ్బదిరెండువేలు ము
ప్పిరిగొని వానిలో నిడకు పింగళకున్నడుమన్ బ్రవర్తిలున్
శిరమున బ్రహ్మనాడి యది చిత్రముగా నొకశక్తి సిద్ధిరన్
జరుపు దదాశ్రయంబున రజాలపురీనిలయా జనార్దనా. 68

చ. ఇలపయి దన్నుఁదా దెలిసెనేని మనుష్యుఁడు సర్వసంశయం
బులు విడు ఖేదమోదములు బొందవు మృత్యుభయంబు బాయు లో
పలవగు బంచవాయువులు బట్టువడున్ బరవస్తుదర్శనో
జ్జ్వలుఁడగు గొన్నినాళ్ళకు రజాలపురీనిలయా జనార్దనా. 69

ఉ. వక్రత గుందుచుండిన త్రివక్ర సమాంగినిజేసి తాజిలో
విక్రమరేఖచే వెలసి వీరనిశాటుల దుంచినావు భూ
చక్రము నేల రాజులను సాహసవంతుల బూన్చినాడ వో
చక్రి నమస్కరించెద రజాలపురీనిలయా జనార్దనా 70

చ. సలలితవాక్యసంపదలు జాలని నేనిక నీమహత్త్వమున్
దెలిసి నుతింప నేపగిది నేర్తు గురుండనుగాను వేయి నా
ల్కలుగల భోగినాయకుఁడగాను మొగంబులు నాలుగున్న యా
జలజభవుండ గాన్గద రజాలపురీనిలయా జనార్దనా. 71

ఉ. మున్నల నారదుండు మునిముఖ్యుడు వీణియ బూని స్వర్గమం
దన్నగవైరి మోసిలె సుర లండఱు మెచ్చగ గానవిద్యచే
తన్నను బాడ నయ్యెదియ ధాత్రి లోకించుచు ఢిల్లి గాయకా
సన్నత మెప్పుచున్నది రజాలపురీనిలయా జనార్దనా. 72

చ. కొమరుడు వేల్పుపెద్ద యనుకూల వధూమణి యబ్ధికన్య ర
మ్యమగు విశాలపట్టణము మున్కి మహాఫణిరాజు శయ్యగా
నమరిన తావకీనవిభవాతిశయంబు గణింప శక్యమా
సమరపరాజితాసుర రజాలపురీనిలయా జనార్దనా. 73

చ అరిదిగదా భవన్మహిమ యార్తులపట్ల దయాపరుండవై
కరివిభు నేలినావు తిన గట్టిగ గూడును బట్టలేని భూ
సురు గనకాభిషేకపరిశోభితు జేసితి కృష్ణ మానమున్
సరభస మొప్ప గాచితి రజాలపురీనిలయా జనార్దనా.

చ. తలపులమానికంబు క్రియ దాసజనప్రచయంటు గోసు కో
ర్కెల సిడుదంచు బండితన రేణ్యులు పల్కెడిమాట సత్యమై
వెలయ మదీప్సితంబు నెఱవేరుపుమయ్య త్వదీయభక్తి హృ
జ్జలజమునందు నిల్పితి రజాలపురీనిలయా జనార్దనా.

చ వయసు గతించె గొంత పులివై ఖరి భీతి జనింప జేయుచున్
పయిబడ నున్నదింక జర వాపుకొనంగ వశమ్ము గాదు నీ
దయ గలవాడ నేని పరదైవమ నాకొక లోటు రాదు సం
శయ మిపు డొంద నేటికి రజాలపురీనిలయా జనార్దనా. 76

ఉ. ఏననువా డెవండో యిత డెక్కడనుండెను [illegible]
ఈనికి నామ మెయ్యదియొ యీడు మరుంగవడంగ నేటికో
మేన నెఱుంగజాలరు సుమీ జను లీతని దర్శనంబగున్
జ్ఞానము గల్గువానికి రజాలపురీనిలయా జనార్దనా. 77

చ. కొల నొకఁ డొప్పు నా దయిదు కొంగలు హంస మొకం డు నుండు బా
పులగు నిషాదు లాఱుగురు మోసమొనర్తు రుపాంతమందు రం
జిలి మతి వీరిఛే నయిన చిక్కుఁ దొలంగును హంసకున్ ద్వదు
జ్జ్వలిత ఘృణారసాప్తిని రజాలపురీనిలయా జనార్దనా. 78

ఉ. మాంసము లోనుగాఁ గలుగు మత్తుపదార్థములన్ భుజించి మీ
మాంసలు దక్కి మాంసలత మానవులం దొక కొంద ఱుందు రీ
సంసృతిసౌఖ్యమే తమకు శాశ్వతమంచు బరం బెఱుంగ కా
శంసువులై నటింపుచు రజాలపురీనిలయా జనార్దనా. 79

ఉ. కోఁదలమంద నేలొకో దిగుల్ గొని దుర్భర మోహవల్లికా
బృందపరీత దుర్విషయవృక్షసముద్భవ వాటవీనట
న్మందమతుల్ రమావిమలమానసపద్మదివాకరున్ ఖగ
స్యందను నిన్ను గొల్వక రజాలపురీనిలయా జనార్దనా. 80

ఉ. భావగభీరమంబు పదబంధురదీర్ఘసమాసకల్పనా
కోవిదతానిరూఢి రసగోపన మొప్ప మహాప్రబంధముల్
వావిరి పూర్వపుంగవులు వ్రాయుట యుష్మదనుగ్రహాప్తి వా
చావిభవంబు గాంచియె రజాలపురీనిలయా జనార్దనా. 81

చ. కల దొకపర్వతంబు నవకందరసుందర మున్నతంబు లో
పల నొక యోగివర్యుఁడు తపం బొనరింపుచు నుండె వానికై
పలువురు శిష్యభావమున వర్తిలుచున్ దమలో నమస్క్రియల్
సలుపుచు నున్నవారలు రజాలపురీనిలయా జనార్దనా. 82

ఉ. నీరజనాభ నీదు పదనీరజముల్ మది నమ్మి కొల్తు రె
వ్వారలు వారికిన్ నరకబాధలు లేవు విపత్పరంపరల్
దూరము నొందు నిత్యపరితోషముతోడ మహేంద్రపట్టణ
స్వైరవిహార మబ్బును రజాలపురీనిలయా జనార్దనా. 83

చ. తనువులు వేరుగాని నియతంబుగ లో వెలుగొందు నాత్మ వే
ఱొక్కనగ నొకండె దాని కిక రోగము లేవియు లేవు గాలిచే
తను చలియింప దగ్నిబడి దగ్ధముగా దొకవేళనైన నా
శనమును బొంద నేదు రజాలపురీనిలయా జనార్దనా. 84

ఉ. భర్తడ నన్ను బ్రోవదగు భారము నీయది సుమ్మటంచు దీ
నోక్తులు వల్కి మ్రొక్కులిడ నోయి దయాపర యెందు డాగితో
భర్తను వీడు గాడనుచు భావమునం దలపోసినావొ నీ
శక్తి నెఱుంగ జేయవు రజాలపురీనిలయా జనార్దనా. 85

చ. అరుణగభస్తి కడ్డముగ నంబుధరప్రకరంబు బర్వ బం
కరుహము మాటిమాటికిని గంపము నొందె వెలుంగుజూచి ని
ర్భరపరితోషముం గనెడి భాగ్యము మాదృశులైనవారి కే
సరణి లభించునో కద రజాలపురీనిలయా జనార్దనా. 86

చ. వలబడి పక్షియున్నదిక బక్షబలం బుడిగెన్ దయారసా
కలితుడు గాడు లుబ్ధకుడు గావగ నోపినవార లెవ్వరున్
మెలగరు చెంత కర్మగతి మీద నెటున్నదొ ప్రాణరక్షకై
సలుపు ముపాయ మచ్యుత రజాలపురీనిలయా జనార్దనా. 87

చ. ఒక పెనుబాము వా దెఱచి యూరక ప్రాణుల మ్రింగెడిన్ భయా
నకముగ దాని మ్రోల నరనాథకుమారుల శౌర్యముల్ పిశా
పికలగు యోగమార్గమున విశ్రుతసాంఖ్యము నొందు వాయుభ
క్షకులకు దూర మియ్యెది రజాలపురీనిలయా జనార్దనా. 88

చ. క్షరుడన నక్షరుండన నెసంగెడి పూరుషు లిర్వురందు భా
సురపురుషోత్తమాఖ్య గొనుచున్ సకలంబును నీవయై చరా
చరము సృజింప బెంప నణచంగ సమర్థుడవయ్యు యోపయో
శ్శరధిశయాన మ్రొక్కెద రజాలపురీనిలయా జనార్దనా. 89

ఉ. కమ్మరిపుష్ప పంకమున గ్రమ్ముచుచున్ మెయినంటనీదు పం
కమ్మను నల్లి జ్ఞానమునుగన్న మనుష్యుడు సంసృతిప్రచా
రమ్మున నుండియున్ హృదయరంగమునన్ జొరనీయ డొర లే
శమ్మయినన్ మమత్వము రజాలపురీనిలయా జనార్దనా. 90

ఉ. కామము వీడి క్రోధమును గాంచక లోభము మాని మోహ ము
గ్రామత బారదోలుచు మదంబును మత్సరమున్ త్యజించువా
డే మునిసత్తముం డతని డెందమునందు విహార మూని యో
స్వామి సుఖంబు గూర్చెదు రజాలపురీనిలయా జనార్దనా. 91

చ. కరివరదున్ మురాంతకుని కాంచనచేలుని పర్వశర్వరీ
వరవదనున్ రమారమణు వార్ధిశయానుని విష్టపత్రయీ
గురు మురళీనినాదరసికున్ మధుసూదను వేదవాగగో
చరు నిను జూచుటెన్నడొ రజాలపురీనిలయా జనార్దనా. 92

చ. అనఘుని నీలనీరదనిభాంగుని కృష్ణుని నిర్మలున్ నిరం
జను నిగమాంతవేద్యు ఘను సత్యచరిత్రుని శంఖచక్రధా
రిని యదువంశభూషణు హరిన్ మృదుభాషణు బుండరీకలో
చను నిను జూచుటెన్నడొ రజాలపురీనిలయా జనార్దనా. 93

చ. ఉరమున కౌస్తుభాభరణ మూనినవాని మయూరపింఛమున్
శిరమున దాల్చువాని తులసీవనసీమ వసించువాని పా
ర్థరథము దోలువాని ప్రణతుల్ గొనువాని మహానుభావు నీ
శ్వరు నిను జూచుటెన్నడొ రజాలపురీనిలయా జనార్దనా. 94

ఉ. నందుని ముద్దుపట్టి వగునా డొనరించిన చిత్రచర్య లె
ల్లం దలపోయ మానుషవిలాసములా యవి కావు కావు మే
ల్పొందిన చిద్విలాసములె యోగు లెఱుంగుదు రిట్టివాని స్ర
క్చందనభూషణప్రియ రజాలపురీనిలయా జనార్దనా. *95

చ. తనువును బాసిపోవుతఱి ధైర్యము చిక్కుట దుర్లభంబు గా
వున మనుజుండు సుస్థిరత బూని దృఢంబుగ నుండినప్పుడే
మనమున బుద్ధియుం దగ సమర్పణముం బొనరించి నీదు దా
స్యనిరతుడౌట మేలగు రజాలపురీనిలయా జనార్దనా. 96

చ. పలువురు బ్రహ్మవాదములు పన్నెదువారలె కాని యొక్కరున్
గలియుగమాటనో తెలివి గల్గమినో విడనాడలేరు వాం
ఛలు మనసైన నిల్పుకొనజాలరు శాంతిమెయిన్ బ్రచారముల్
సలుపుదురేమొ కొంచెము రజాలపురీనిలయా జనార్దనా. 97

ఉ. మాయ గడల్కొనంగ మతిమాలిన మానిసులై ధనార్జనో
పాయపరాయణత్వమున బొల్పడి మిన్నక మిత్తికిన్ స్వకీ
యాయువు ధారవోసెద రహంకృతి వీరికి లేకయున్న నీ
సాయము సంభవించును రజాలపురీనిలయా జనార్దనా. 98

ఉ. తా నొనరించు దుష్కృతము దార్కొని కీడు ఘటింప నెవ్వడో
పూనియొనర్చినాడనుచు మూర్ఖుడు వట్టి దురుక్తులాడి స
న్మానవు డెంద మాకులతమై కొనజేయునతండు నారక
స్థానము నొందకుండునె రజాలపురీనిలయా జనార్దనా. 99

చ. జడమతియౌచు నొక్కరుడు సజ్జనకర్ణకఠోరభాషియై
కడువడి కల్లవార్తలను గల్పనముం బొనరించువాడు పు
ణ్యుడగునె పూజ్యుడౌనె సుగుణుండగునే పశువన్న తప్పె యుం
చదు మరియాద సుంతయు రజాలపురీనిలయా జనార్దనా. 100

చ. తరువులలోన గల్పకము తారలలోన సుధాకరుండు భూ
ధరములలోన మేరువును తద్దయు నెన్నికగన్నయట్టి వై
ఖరిగను నీవు దైవతనికాయములోన బ్రశస్తి గాంచితౌ
పరసిజపత్రలోచన రజాలపురీనిలయా జనార్దనా. 101

ఉ. పాపము కావ దెవ్వనికి బట్టి పిశాచముపోల్కి వెంటనే
యీ పడగించు దుర్గతికి ద్రోయు నపాయము దెచ్చు దీనికిన్
నీపదపద్మసేవయె గణింపగ బాచితమార్యధర్మసం
స్థాపనకార్యకారణ రజాలపురీనిలయా జనార్దనా. 102

చ. శ్రమమునుబాపు తానములు సంపరణంబున నొప్పు మూడె యో
గ్యమగు నపత్యమున్ సుగుణగణ్యకళత్రము నీదుభక్తితో
నమరినవానిసఖ్య మిక నన్యము గన్పడ దింతకంటె నో
శమితవియచ్చరాహిత రజాలపురీనిలయా జనార్దనా. 103

చ. మహితులు తోటవంశ్యులు కుమారపరాక్రము లాశ్రితావళీ
ప్రహితదయుల్ ముకుందపదభక్తిధురంధరు లందు పెద్దయై
మహి దనరారె పెద్దయసమాఖ్యు డతండు దిగంతభాగ్యశ్రీ
స్సహితుడు పుణ్యవంతుడు రజాలపురీనిలయా జనార్దనా. 104

ఉ. వానికి బుట్టె నయ్యమృతవార్ధికి శీతకరుండువోలె వి
జ్ఞాని పరేంగితజ్ఞుడు ప్రశాంతుడు పాత్రధనుం డుదారుడై
దానము ధర్మముం దెలిసి ధన్యతనందినవాడు మంచి ప్ర
జ్ఞానిధి చంద్రయాఖ్యుడు రజాలపురీనిలయా జనార్దనా. 10

చ. అతనికి నుద్భవించెను మహామతి మానధనుండు సాధుసం
తతికి హితుండు యాచనకదైన్యవిభేది కృతజ్ఞతాన్వితుం
డతులితధైర్యశాలి భవదద్భుతపుణ్యకథాభిలాషియున్
జతురుడు చల్లయాఖ్యుడు రజాలపురీనిలయా జనార్దనా. 106

ఉ. మున్ను ప్రతిష్ఠ చేసిరి ప్రమోదముతోడ మహాత్ము లెవ్వరో
తన్నియమానుసారియయి ధర్మము నిల్పుటకై పునఃప్రతి
ష్ఠన్నరవేర్చె తోటకులచంద్రుడు చల్లయనాయ డాతడే
సన్నుతశీలు డిద్ధర రజాలపురీనిలయా జనార్దనా. 107

ఉ. ఉల్లములో నినున్ నిరత ముత్తమభక్తిని నమ్మియున్నవా
డల్లమరాజు సోమకవియంచు జనుల్ పిలువంగ నొప్పువా
డల్లన నల్లి యీశతక మర్పణజేసె దయారసంబుపై
జల్లుచు బ్రోవు మాతని రజాలపురీనిలయా జనార్దనా. 108

ఉ. మంగళ మంగజాతశతమానితరూపవిశేషభాసురా
మంగళ మాశ్రితప్రకరమంగళదాయక మంగళం బికన్
మంగళదేవతారమణ మంగళమౌ సతతంబు నీకు నో
సంగరభూరివిక్రమ రజాలపురీనిలయా జనార్దనా. 109

శ్రీజనార్దనశతకము.

సంపూర్ణము.



సీ. శాలివాహనశక సంవత్సరంబులు రసవహ్ని భూధర బిసరుహారి
సంఖ్య బ్రవర్తిల్ల సర్వజనానందవర్ధనానందసంవత్సరమున
జ్యేష్ఠమాసవిభాసి సితపక్షదశమిని బుధవాసరంబున మిథునలగ్న
మునబుధుల్వొగడంగ ననుకూలతరజాలనామాన్వితగ్రామసీమయందు

మహిత తోటకులాంభోధి తుహినకరుడు
ఘనుడు చల్లయనాయండు వినయమున జ
నార్దనస్వామిని ప్రతిష్ఠ నందజేసె
నిజయశంబు లోకంబున నిండుకొనగ.

